

# వారణాసి ఉమా శ్రీ రామ కృష్ణ అఫ్ అమరావతి సొంత కథలు



From   21-02-25 to 25-03-25

Writer - 9908482191 or 6301796990




**15.**వయస్సు లో - మనస్సు లు 25-03-25

మీ అందరి లాగా నేనో - నా లాగానే మీరందరూనో - ఎదో ఒకటి. ఒక పెళ్లి ఫంక్షన్ కి వెళ్లి " ఇక్కడ- ఇప్పుడు - ఈ వయసులో - నాకేమీ ప్రాముఖ్యత లేదు . నేను వున్నాను అనుకున్న వారు వారంతట వారే వచ్చి పలకరించుతారు " అనుకుంటూ వెనక వరుసల్లోని కుర్చీలో కూల బడ్డాను .ఇదే నావయసుకు నా కుండవల్సిన ఆలోచన అని నా నిర్ణయం . ప్రతి ఫంక్షన్స్ లోనూ అనవసర హంగామా చేసి అందరి దృష్టిని తమ వేపు తిప్పుకోవాలనే ఆలోచన గల నా వయసు పెద్దలు నాకు కనపడుతూ వుంటారు. ఇలాంటి వారిని మరో ఫంక్షన్ కి పిలవటం గృహస్థు లు మర్చి పోతారు.నాలాగా మౌన ముని లాగ వుండే వారిని అయితేనే వారు మరోఫంక్షన్స్ కి పిలుస్తారు .

పులి కోసం చూస్తున్న టైములో పిల్లి వచ్చినట్లు ఒక పిల్ల వాడు వచ్చి " తాతా నాతో మాట్లాడ లేదేమి ?" అని అడిగాడు .

అప్పుడు నేను " మీరు పిల్లలు వచ్చి పెద్దను పలకరించాలి . అదే మన సంప్రదాయము - అదే మన సంస్కారము " అనే హితోక్తులు చెబుదాము అనుకోని - దాన్ని తమాయించుకొని ఇట్లా చెప్పాను .

" నాయనా నిన్ను చూచినానురా . నిన్ను ఎప్పుడో నాలుగేళ్ల క్రితం చూసినట్లున్నాను . అప్పుడు నీవు నా వెనకనుండి వచ్చి నా చెవిలో నోరుపెట్టి " తాతా " అని అరిచినావు . నన్ను ఉలిక్కి పడేట్లు చేసి కిలకిలా నవ్వినావు . ఆ జ్ఞపకాన్ని తద్వారా నిన్ను మర్చి పోవటం సాధ్యం కాని విషయం . ఏమైనా కానీ నిన్ను చూడగానే నిను పలక రించవలెనని కోరిక కలిగింది . కానీ సంశయించాను . కారణం -- నాలుగు ఏండ్ల క్రితము నీవు " అందరూ నా బంధువులే- అందరూ నా స్నేహితులే -నేను అందరినీ నవ్విస్తాను అందరినీ ఆటపట్టిస్తాను " అనే బాల శ్రీకృష్ణుని వయస్సులో - మనస్సు తో వున్నావు . అప్పటి నీ బాల్యపు వయసుకు అదే శోభ . ఇప్పుడు నువ్వు కుర్రతనానికి వచ్చావు . ఈ పాటికి నీవు నీ కుటుంబీకులనుండి - ముఖ్యముగా మీ అమ్మ నాయన ల నుండి వినటం ద్వారా వారికీ నచ్చని -లేదా వారి వారికి గిట్టని లేదా వారి శత్రు వర్గము లో ఉన్నట్లు భావింపబడుతున్న మనుషుల గురించి నీవు తెలుసుకునే ఉంటావు . తన వంటి మనిషిలో తన శత్రువును కనుగొనాలని మనుషులకు కోరికగా ఉంటుంది. ఇప్పుడు నీవు నీ బంధువర్గములో ని నీ ఫామిలీ శత్రువుల గురించి- మిత్రుల గురించి ఒక లిస్ట్ ఏర్పరుచుకొని ఉంటావు . శత్రు వు ల నైనా మిత్రులనైనా తన బంధు వర్గములోనుండే చూపించ వలసి వున్నది కాబట్టి - మీ తల్లి తండ్రులు తమ కు" అస్మదీయులు " " తస్మదీయులు " ఐన వారిగురించి మీకూ చెపుతూ వుంటారు . అందులో నీకు

దొరికిన "తస్మదీయుల" పట్ల ఎదో పంతము -ప్రతీకారము పూనవలెనని నీ కుర్ర వయసు నీకు చెపుతూ ఉంటుంది . ఇది కాక అదేదో ప్రేమతో - నీ మేలు కోరు తూ వారు " ఆయనను కదిలించకు - దరిద్రం. - జిడ్డు పట్టుకుంటే వదలడు ఎదో మాట్లాడుతూనే ఉంటాడు " అని కానీ " కాఫీ తెచ్చి పెట్టు - నీళ్లు తెచ్చిపెట్టు " అంటూ నీకేమెమో పనులు చెపుతాడు" అని హితవు చెపుతారు . ఆ హితవును నీవు పాటించవా ?లేదా అని వారు వేయి కన్నులతో నిన్ను కనిపెట్టుతూ వుంటారు . అదీ నీకూ తెలుస్తుంది . చివరికి ఏవంటే ?నా వయసు కున్న మనస్సు తో నిన్ను పలకరిస్తే ?? -- నీ వయస్సు కున్న మనస్సుతో నీవేమి బదులిస్తావో అని నాకు జంకు కలిగింది . నా పరోక్షంలో నీ అమ్మా నాన్న నన్ను గురించి ఏమి విశ్లేషించి చెప్పారో నాకు తెలియదు . నేను నీ అస్మదీయుల లిస్టులో ఉన్నానో - తస్మదీయుల లిస్టులో ఉన్నానో నాకు తెలియదు . నీ తల్లి తండ్రులు నన్ను నీ తస్మదీయ వర్గములో చేర్చారని చెప్పి నీవు - నేను పలక రించినా కూడా పలక్కుండా వెళ్లి పోయినావు అనుకో - ఈ వయస్సులోని నా మనస్సు ఎంతో బాధ పడుతుంది . ఈ వయసులో ని నామనస్సుకు ప్రతి ఒక్కరితో స్నేహము - బంధుత్వము - కావాలనిపిస్తుంది - బంధు మిత్రులను ప్రేమించటానికి మించినది లేదని అనిపిస్తుంది "

ఆ పిల్ల వాడు ఆశ్రీత్ అని పేరు- చక్కగా నా ఎదురు కుర్చీలో కూచుని - తల వెనక్కి తిప్పి శ్రద్ధగా విన్నాడు .నా భయాలని విని దరహాసాలు చేసాడు . అతడు తన కుర్ర వయసుకు తగ్గ మనసు రాని వాడు అని - ఇంకా బాల్యపు మనసుతో నే వున్నాడు అని నేను అతడితో మాట్లాడుతూ సంతోషించాను .

వారణాసి ఉమా శ్రీ రామ కృష్ణ అఫ్ అమరావతి స్వంత కథ

**14.విశ్వాసి 24-03-25**

"ఆమె" గురించి ఎటువంటి సంగతులూ తెలుస్తలేదు - అనుకుంటున్న రోజున - ఆమెనుండి ఒక వాట్సాప్ వచ్చింది . అందులో " బాబాయి గారు . ఆయన హోదాకు అందానికి నేను తగిన దానను కాదేమో అని నాకో అవిశ్వాసము వుండే . మా పెళ్లి అయిన మరునిమిషము నుండీ అయన యొక్క ప్రవర్తనము చూసి "నువ్వూ అందగత్తెవే నీకేమి తక్కువ" అని నాతో చెప్పే నాలోని విశ్వాసి నిద్ర లేచే . మొగవారిని నమ్మ వచ్చునా లేదా అనుకున్నాను . కానీ నా ఆజ్ఞ మీద అయన నా పాదాలు చుంబించటానికి కూడా సిద్ధ పడినపుడు- నా అందమును మెచ్చిన విశ్వాసి ఒకడు ఆయనలో వున్నాడు అని గ్రహించాను . అట్లా మా వివాహ బంధము పట్ల నేనెంతో విశ్వసిస్తైతిని . అదే విశ్వాసముతో కాపురము నడుపుచూ ఉంటిని . అది ఎదో విశ్వాసముతో ఒక నాడు బెండకాయ ముక్కలు స్టవ్ మీద పడవేసి మంటవేసి ఏటో పోయితిని . ఎక్కడికి పోతినో ఎంత సేపటికి తిరిగి వచ్చితినో నాకే తెల్వ ది .

వచ్చి చూడగా ప్రతి ముక్కా రుచి పక్వముగా ఉడికి వున్నదని విశ్వాసము కలిగినది . గంట క్రితము ఎందుకో ఏమో కానీ నా భర్త నన్ను పొట్టు పొట్టు గా దంచి వదిలినాడు .ఎండని ధనియాలను దంచి నట్లు దంచినాడు అని చెప్పేదను . నాకూర మంచిగా వున్నదని నాకు కలిగిన విశ్వాసము ఆయనకు

లేదు - ఇందుకు కారణమూ అయన లోని విశ్వాసి ఏటో వెళ్లి పోవుటయే అని నేను తెలుసుకున్నాను . నా అందము పట్ల , నావంటకముల పట్ల నాలో వున్నా విశ్వాసి అట్లే ఉండగా - విశ్వాసి లేని ఆమనిషి తో నేను కాపురము చేయబోను . మీరు నా పెద్దగా ఉండి మాకు విడాకు కాగితాలు సిద్ధ పరచమని కోరుతున్నాను ."

{విశ్వాసి ? . పీవీ గారి ఇన్సైడర్ లాగా ప్రతి వారిలో ఓ విశ్వాసి ఉంటాడు లేదా ఉంటది. విశ్వాసి మరియూ ఇన్సైడర్ ఇద్దరూ ఒక్కరే కావచ్చును కాకా పోవచ్చును }.

వారణాసి ఉమా శ్రీ రామ కృష్ణ అఫ్ అమరావతి స్వంత కథ

**13.**నెగిటివ్ ఎనర్జీ **23-03-25**

నేను నా బ్రతుకుతెరువు కోసం అని పట్నం వచ్చినట్లే - మా ఊరు మనిషి ఒకామె పట్నం వచ్చి హోటల్ పెట్టుకుంది . ఒంటలక్క ప్లస్ ఓనర్ ఆమే . ఆమెను ఒంటలక్కా అని పిలవలేక అక్కా అని పిలుస్తాను . మనఊరుకు చెందిన ఓ అక్క ఓ హోటల్ పెట్టి మనకోసమని ఓ స్పెషల్ అట్టు వేసి ఇస్తే వచ్చే పండుగలే వేరు .అని తలచి " అక్కా ఓ అట్టు " అన్నాను.

ఆమె తన కోడలు వంకతిరిగి " మా తమ్ముడొచ్చిండు .ఇంకా చెట్నీలు అవ్వలేదా ? వాటికి తిరగమోతలు పెట్టలేదా ? ప్రతి పెధవకి ఆ పెసరట్టు లోకి ఉల్లి అల్లం మిర్చీ జాలీగా పడాలి . అవింకా తరగలేదా ? పెధవలు ఎక్స్ట్రాగా సాంబారు అడుగు తాబు . నువ్వింకా సాంబారు కాచలేదా ? ఏంచేస్తున్నావు . గాడిదలు కాస్తున్నావా ? అని ఎగిరి పడింది .

ఆ కోడలు గాలి లోకి చూసి " పొద్దున్నే ఓ పెధవ దరిద్రం తయారు " అన్నది. ఆ -- గాలిని అని వున్నది లే అని నేను సమాధాన పడ్డాను . ఆ పై అత్తాకోడలు రెట్టించుకొని రెట్టించుకొని పోట్లాడుకున్నారు .

" అక్కా పొద్దున్నే నా వల్లనే ఇదంతా నూ . నేను పోయి మళ్ల వస్తాను లే " అని నేను కదల బోతిని .

" ఆగరా తమ్మీ - అపార్థం చేసుకోకు . నీములకంగా అని మేము పోట్లాడుకోవటం లేదు .ఇది అసలు పోట్లాటనే కాదు . నేను నా కోడలికి నెగిటివ్ ఎనర్జీ ఇస్తూ వున్నాను .ఇప్పుడు దానిలోని పాజిటివ్ ఎనర్జీ ఎట్లా బయటికి తన్నుకు వస్తుందో చూడు " అన్నది .

-- ఆమె చూడు అన్న దాన్ని చూసి నేను ఇది తెలుసుకున్నాను . అత్త అంటే నేల వంటిది . కోడలు నింగి వంటిది . నేలలో నెగిటివ్ ఎనర్జీ ఉంటుంది . నింగిలో పాజిటివ్ ఎనర్జీ ఉంటుంది .

కాస్తంత నెగిటివ్ ఎనర్జీ వాసన తగలంగానే నింగిలో వున్న పాజిటివ్ ఎనర్జీ కిందకు దూకి మెరుపు గా మారుతుంది . ఆ మెరుపు ఎన్నో పనులు చేస్తుంది . వాటినే మనము మెరుపు వేగంతో జరిగిన పనులు అంటాము .మెరుపు చేసే పనులు ఏమినో మనకు తెలవది . మనకు తెలీకుండా జరిగే పనులనే మెరుపు వేగంతో జరిగిన పనులు అంటాము . మెరుపు లా లేదా మెరుపు వేగం తో జరిగిన పనులు అనేవి నెగిటివ్ అనేది ఉండటం వల్లనే - కదా ? సాధ్యపడిందని మనము గ్రహించాలి . అట్లాగే కోడలు చేసే చాకిరీ పనులన్నీ కూడా అత్తా అనే నెగిటివ్ ఉండటం వల్లనే కదా సాధ్య పడింది అని కూడా మనము గ్రహించాలి .

అత్తగారు నెగిటివ్ ఎనర్జీ అందివ్వగానే కోడలు మెరుపు వేగంతో పనులు అందుకుంది .ఐదు నిమిషాలలోపు అత్తగారు చెప్పిన పనులన్నీ చేసి పడేసి అదే వేగంతో గల్లా పెట్టె దెగ్గిరకెళ్ళి కూచుంది .

ఇహ పెసరట్టు తింటూ ఉండగా నా కన్నులు పూర్తిగా విచ్చుకొని - అందులన వెలుగులు నిండాయి . ఆ వెలుగుల సారం ఏమిటంటే ? అత్తలు కోడళ్ల మీద కచ్చి కట్టినట్లు పోట్లాట చేయటం ద్వారా వారికీ నెగిటివ్ ఎనర్జీ ఇస్తారు . ఈ నెగిటివ్ కనపడంగానే కోడళ్లలోని మెరుపు మెరుపు వేగం తో బయటికి తన్నుకు వస్తుంది . అంటే-- కోడలు లోని మెరుపును బయటికి తీసుకు రావాలనే -- అత్తలు కోడళ్లతో తగాదాలు పెట్టుకుంటారు . తీరా ఏందయ్యా అంటే - అత్తలు అనగా తమ వద్దనున్న నెగిటివ్ ఫోర్స్ తో కోడళ్లలో వున్నా మెరుపును వెలికి తెచ్చే ఉత్తమురాళ్ళు. తమలోని పాజిటివ్ మెరుపు ను తట్టి లేపినందుకు- అని కోడళ్ళు అత్తల పాదాలకు మొక్కాలి . వారు బ్రతికి ఉన్నంత వరకూ మొక్కుతూనే ఉండాలి . వీరు కూడా తిరిగి అత్తలైనాక అట్లాగే మొక్కించుకుంటూ ఉండాలి . ఈ సంగతి ఏ తరతరాల భారతీయ అత్తా కోడండ్ర బంధము ఐ వర్ధిల్లుతూ వస్తున్నదని నా ఉవాచ .

ఇహ ఇప్పుడు నా మూలకంగా , ఇదీ విషయం అని అర్ధం చేసుకున్న కోడళ్ళు - అత్తలను ఆడి పోసుకోకుండా - ఉత్తమ చిత్తంతో ఆడుతూ పాడుతూ - సుఖంగా ఉమ్మడి కాపురం చేసుకుంటారని ఆశిస్తాను .

వారణాసి ఉమా శ్రీ రామ కృష్ణ అఫ్ అమరావతి స్వంత కథ

**12.ఉప్పూ - కారం - బలాత్కారం 21- 03-25**

.

"ఆయన నన్ను బలవంతం చేసాడు " అని ఆమె అన్నది .

"ఏమండీ మీరు ఆమెను బలవంతము చేసారా ?"

" ఆ ఎదో బుద్ది గడ్డి తిని చేసాను . మీకు తెలీనది ఏముంది ? ఎవరన్నా కానీ నలభయ్యో యాబయ్యో వయసు వచ్చే వరకు మాత్రమే బలవంతము చేయకలుగుతారు . వంటిలో పట్టు తగ్గి నాక - జరిగేదంతా ఆమె వల్లనే కదా జరుగుతుంది? అందువల్ల నాదేం లేదు "

" ఎమ్మా నీ వేమంటావు ? "

" అయన బలవంతము చేయబట్టి నేను ఆ బాలవంతానికి అలవాటు పడ్డాను కాబట్టి చివరికిట్లా అయింది . ఇందులో అచ్చంగా నా తప్పేమీ లేదు "

పై లాగ మాట్లాడుకుంటున్న వారు ముగ్గురు అని తెలుస్తూనే వుంది . "చివరికి ఇట్లా ఐంది" అనటాన్ని బట్టి ఆమె అవాంఛిత గర్భంతో ఉన్నదేమో అని డౌట్ వస్తోంది . కానీ ఇందులోని ఒకరు భర్త - మరొకరు భార్య - మూడో వారు మధ్య వర్తి . అని తెలుసుకుంటే - జరుగుతున్నది ఒక మధ్య వర్తి ముందు పంచాయతీ లాంటిది అని గ్రహిస్తాము .

స్వంత భార్యనైనా సరే ఆమె ఇష్టానికి వ్యతిరేకంగా అనుభవించటం - ఆమెను బలవంతం చేసిన నేరము అవుతుందని - ఎక్కడో ఎదో కోర్టులో ఒక తీర్పు వున్నదని మీకు తెలుసునని నాకు తెలుసు . ఆ తీర్పు ఈ నేపధ్యములో ఇక్కడ ఎదో ఓ చెట్టుకింద పంచాయతీ జరుగుతున్నది అని కూడా మీరు అనుకో వద్దు . డాక్టర్ ఈశ్వర్ చందు - జీ ఎం ,ఎం ఎం. బీ ఎం ,బీ ఎస్ - ఎం ఎస్, ఎస్ ఎస్ . అనబడే నగర ప్రముఖ డాక్టర్ గారిచే - అయన ఛాంబర్లో ఈ పంచాయతీ లాంటిది జరుగుతున్నది.ఈ డాక్టర్ గారు రోగుల పట్ల అత్యంత శ్రద్ధ వహిస్తారు గనుక ఇట్లాంటి పంచాయతీ చోటు చేసుకొన్నది .

పంచాయతీ ఇట్లా స్టార్ట్ అప్ అయింది ఎలాగంటే ." నాకేదో గుండె గాభరాగా వుండండి " అంటూ డాక్టర్ చందు గారి వద్దకు వచ్చాడు సుబ్రహ్మణ్యం గారు . వస్తూ వస్తూ తోడు కోసం అని భార్య సువర్చలను కూడా వెంట తెచ్చుకున్నాడు . డాక్టర్ గారు - సుబ్రహ్మణ్యం ను పరిశీలించి పరీక్షించి " ఎప్పుడో ఆరు నెల్ల కిందనే మొరాయించ వాల్సిన నీ గుండె ఇంకా మొరాయించలేదు . దాని ఓర్పుకూ, దాని పని తనానికి అని- నీ గుండెకు బంగారు గండపెండేరం వేయాలే " అని డాక్టర్ గారు నవ్వేడు .

తనకు పేషంటుకు మధ్య వుండే టెన్షన్ తగ్గించటానికి అయన ఆలా నవ్వుతాడు. నవ్వి ' ఏమమ్మా ? భార్య గారూ . మీరు మీ కూరలు నూనెలో ఉడికించి ఉప్పూ కారాలు దట్టించి వేస్తారు కాబోలునా ? " అని ఒక ఆరోపణ చేసాడు . ఈయన గుండె జబ్బుకు నీవే కారణం అన్నట్లు .

భర్త గుండె జబ్బుకు తనదే నేరము అన్నట్లుగా - సీన్ మారుతూ ఉండటం వలన ఆమె ధైర్యం తెచ్చుకొని {"ఉప్పూ కారాలు దండిగా వేయమని} ఆయనే నన్ను బలవంతం చేసేవాడు " అన్నది .

"ఏమండీ మీరు ఆమెను బలవంతము చేసేవారా ?" అని డాక్టర్ గారు అడిగాడు .

" ఆ వయసులో ఎదో బుద్ధి గడ్డి తిని అలాచేసాను . మీకు తెలీనది ఏముంది ? ఎవరన్నా కానీ నలభయ్యో యాబయ్యో వయసు వచ్చే వరకు మాత్రమే అలా బలవంతము చేయకలుగుతారు . వంటిలో పట్టు తగ్గి నాక కూరలలో ఉప్పూ కారము వేయి అని బలవంతము చేయటానికి మనసు రాదు . కాబట్టి జరిగిందంతా కేవలం నా బలవంతం వల్లే జరిగింది కాదు " అన్నాడు భర్త .

" ఎమ్మా నీవు ఎం అంటావు? " అన్నాడు డాక్టర్

" మొదట్లో అయన బలవంతము చేయబట్టి నేను ఆ బాలవంతానికి అలవాటు పడఃబట్టీ జరగాల్సింది ఎదో ఇట్లా జరిగింది కానీ అచ్చంగా నా తప్పేమీ లేదు " అని భార్య అన్నది .

"సరేనమ్మా - ప్రతి ఇంటిలో లాగానే - పప్పులో కూరలో పచ్చడులలో ఉప్పూ కారం కోసం అని అయన మిమ్మల్ని బలవంతము చేసాడు అనేసి నేను నమ్ముతున్నాను . అఉప్పూ కారం ఆయనకే కాదు-- మీ ప్రాణాల మీదకి కూడా తెస్తుంది . కాబట్టి మీరు బలవంతానికి గురి అయినారు అని నేను ఒక డాక్టర్ సెర్టిఫికెట్ ఇస్తాను .అయన గనుక మరల ఉప్పూ కారాల కోసం మిమ్ములను బలవంతము చేస్తే ఈ సెర్టిఫికెట్ ఆధారంగా విడాకులు అడగండి .నేను వచ్చిమీకు సాక్షం పలుకుతాను. ఇట్లాగైతే కనీసం మీ ప్రాణాలనైనా రక్షించుకుంటారు " .అని డాక్టర్ గారు అన్నాడు .

వారణాసి ఉమా శ్రీ రామ కృష్ణ అఫ్ అమరావతి స్వంత కథ

**11.**ఎవరి కొలతలు వారి ఇష్టము .. **19-03-25**

మనము విడవకుండా ఎదో ఒకటి మాట్లాడే దానికన్నా - దారిని పోయే పరిచయస్తులని పిలిచి వారిని అడిగి ఎదో చెప్పించుకొంటూ ఉంటే చక్కగా - కాలక్షేపం అవుతుంది . కాల క్షేపం కల్పించుకోవటం తెలివి అవుతుంది . కాలక్షేపం చేయటం తెలివిడి అనిపించుకుంటుంది .

మా ఇంటి అరుగు దారిన ఓ పిల్లకాయ పోతున్నాడు . వాడు నాకు తెలిసిన వారి పుత్రుడు .

" ఇదిగో అబ్బాయి .. కారు మీద చూసినట్లైతే " ఇన్నోవా 2.5 లీటర్లు అని రాసివుంటుంది . కారుని లీటర్లలో కొలుస్తారూ ? " అలాగే లగేజీ బ్యాక్ ప్యాక్ కి " కెపాసిటీ 65 లీటర్లు " అని రాస్తారు . అదేమిటో కొంచెము వివరించి చెప్పు. ఇట్లాగా అయితే వాళ్ళ కారు కన్నా నా బ్యాక్ ప్యాక్ పెద్దదీ? గొప్పదీనా ? " అని అడిగాను .అతడు గాలం తగిలిన చేపవాలే ఆగాడు .

" పెద్దయ్యా -- అదేందో నాకు తెల్వది .ఈ కొలతలు ఎవరిష్టం అనుకుంటాను .ఎందుకంటే - మా పాల వాడు పాలను కేజీ లెక్కలో కొనుక్కు వచ్చి లీటర్ల లెక్కలో అమ్ము తాడు . వాడు నాది 500 కేజీల వ్యాపారం అని చెపుతాడు . మా తమ్ముడు వాడి డ్యూటీలో వాడు బండ్లకు కొట్టే పెట్రోల్ 3000 లీటర్లు దాకా ఉంటుంది కాబట్టి - నాజాబు 3000 లీటర్ల జాబు - ఎక్కడన్నా గానీ ఇదే జీతం తో 2000 లీటర్ల జాబుఉందేమో అని వెతుకుతున్నాను అంటాడు . వాడి భార్య 10000 లీటర్ల జాబు చేయి అని పోరుతుంది . ఇట్లాగా పనిబద్ధకాని లీటర్లలో కొలవచ్చు . కొందరు ఆడపిల్లల అందాన్ని అంగుళాలలో లెక్కేసి ఉద్రేక పడతారు . ఇట్లాగా ఎవరిష్టాన్ని బట్టి వారి కొలతలు ఉంటవి . ఆ డీటెయిల్స్ మనకేమీ పని చేయవు . కారు బాగా నడిచేదా కాదా ? అని, బాగ్ జిప్పీ గట్టిగా ఉందా లేదా ? అనీ - భార్య అనుకూలవతి అవుతాదా ? కాదా? అనీ చూసుకుంటే చాలు .. మనకు రోజులు కులాసాగా గడిచి పోతవి "

"అంటే .ఎవరిష్టం వారిది గా ఈ కొలతలు ఉంటవి అని నువ్వన్నట్లు అనుకుందాము . మరి నీజాబు ఏమిటో దాని కొలతలు ఏమిటో చెప్పు "

" నేను హాస్పిటల్ లోని బ్లెడ్ టెస్టింగ్ ల్యాబ్ లో పని చేస్తాను . హాస్పిటల్ వాళ్ళు ల్యాబ్ ను "లీటర్లరక్తము" అని లెక్కవేస్తారు . అందువల్ల నేను- నాలాంటి వారము అందరమూ మా జాబులను రక్తపు లీటర్లలో లెక్క వేస్తాము .ఈ లీటర్లను పట్టే మాజీతము కూడా టుంది"

" అదెలాగో చెప్పు " అన్నాను నా సంభాషణ చాతుర్యానికి మెరుగుగులు దిద్దుకుందామని .

" పెద్దయ్యా -- మా లాబ్ ను ఐదు లీటర్ల ల్యాబ్ అంటారు . అంటే వచ్చిన ప్రతి పేషేంట్ నుండీ 20 మిల్లీ లీటర్ల రక్తము చొప్పున తీస్తే - రోజుకు ఐదు లీటర్ల రక్తము ను పరీక్షా చేయటానికి వీలున్న ల్యాబ్ అని అర్థము .నాకు ఉద్యోగము ఇచ్చేటపుడు " నువ్వు రోజుకు ఎన్ని లీటర్ల రక్తం పరీక్ష చేయగలవు ? అని అడిగితే " నాలుగు లీటర్లు " అని చెప్పాను . అప్పుడు వారు నాతో " మా ల్యాబ్ లో రోజుకు నాలుగు లీటర్ల రక్తం తీయాలి . లేదంటే మీ జీతాలు - మా లాభాలు -
ల్యాబ్ ఖర్చులూ గిట్టు బాటు కావు . నాలుగో లీటర్ మన లాభాల లీటరు . అందువల్ల ఏ రోజు చూసినా నీకు నాలుగు లీటర్ల తక్కువ గాని పని ఉంటుంది . ఈ నాలుగు లీటర్ల పని కూడా ఉదయం 11 గంటల లోపే ఉంటుంది . మీకు కష్టించి పని చేయాలి- భగవంతుని దయవల్ల

మన కు రోజుకు ఐదు లీటర్ల రక్తం వస్తే - మీకు  జీతం పెంచుతాము - ఇష్టం అయితే మీరు రేపే జాయిన్ అవండి అని చెప్పారు ."

"నువ్వు చెప్పిన దానిని బట్టి అనేక ము తెలుస్తున్నావి -మరి నువ్ చేరవా ?"

"లేదు ,అక్కడ ఇప్పటికే పని చేసి వచ్చిన వాడు " అది పేరుకే ఐదు లీటర్ల ల్యాబ్ కానీ ఏనాడూ ఏడు  లీటర్ల కు తగ్గని ల్యాబ్ . ఇక్కడ నలుగురు డాక్టర్లు వున్నారు . ఒక్కొక్కరికీ రెండు  లీటర్ టార్గెట్ ఇచ్చారు . అందువల్ల నువ్వు ఇక్కడ ఉందయం ఎనిమిది నుండీ 11 వరకూ ఏడు లీటర్ల పని చేయక  తప్పదు . అందువల్ల జాయిన్ అయ్యేముందు బాగా ఆలోచించుకొని జాయిన్ ఆవు" అని సలహా చెప్పాడు . అందుకని ఆగాను "

" అంటే రెండు లీటర్ల పని కోసం చూస్తున్నావా ?"

" కాదు రోజుకు ఫది లీటర్లు అయినా గానీ నెలకు   లక్ష జీతం ఇచ్చే జాబు కోసం చూస్తున్నాను "

చూసారుగా - నా సంభాషణా చాతుర్యం వల్ల నేను అనేక విషయాలు కనిపెట్టుతూ వున్నాను. సంభాషణ పొడిగింతామని- మరిన్ని విష్యాలు తెలుసుకుందామని  " నన్ను  ఎన్ని లీటర్ల హాస్పిటల్ కి వెళ్ళమన్నావు ? అని అడిగాను .చూసారుగా నేను హాస్పిటల్ ని లీటర్లలో కొలిచాను .  హాస్పిటల్ కి పోయి బెడ్ లో చేరని వారికి హాస్పిటల్ కొలత బెడ్స్ లో వుండటము అనవసరం కానీ నాకు కాదు కదా అని నేను దాన్ని లీటర్ల లో కొలిచాను .

"రెండు లీటర్ల ల్యాబ్ వున్నా హాస్పిటల్కు  పోవు . అక్కడైతే ఓ ఐదారు బ్లడ్ టెస్టులకు బదులు - ఎదో ఒక్క బ్లడ్ టెస్ట్   రాస్తారు . నువ్వు తేలికలో బయట పడతావు . బ్లడ్ ఇచ్చేముందు ఆ ల్యాబ్ టెక్నీషియన్ను  ఇది ఎన్ని లీటర్ల లాబు .అని క్యాజు వాలుగా అడుగు  " అని అతడు అన్నాడు .
అని సెకనుకు నాలుగు మీటర్ల ఓపిక అన్నట్లు నడుచుకుంటూ కనుమరుగై పోయాడు .

వారణాసి ఉమా శ్రీ రామకృష్ణ అఫ్ అమరావతి యొక్క సొంత కథ

**10.**సమురాయ్ తెలివి **18-03-25**

సమురాయ్ అంటే జపాన్ దేశపు యుద్ధ వీరుడు . వీరు 20 %ధైర్యము, 20 % ప్రాణాలను త్యజించే తెగువ నూ ప్రదర్శిస్తూ యుద్ధము చేస్తారు అనుకుంటే ఆ మిగతా 60 % లో తమ తెలివిని ప్రదరిస్తూ యుద్ధము చేస్తారు అని చెప్పుకోవాలి . మనకు ఋషి వాక్యము అని ఉన్నట్లు జపాను వారికి సమురాయ్ తెలివి అనే మాట ఉంటుంది .

ఒక సమురాయ్ గారు 19 లేదా 20 ఏండ్ల వయసు న రాజ్య అధికారము చేజిక్కించుకొని అనేక రాజ్యాలను గెలిచి - ఆ యుద్ధాలలో ఎక్కడనో "క్షయ" వ్యాధిని అంటించుకొని వచ్చాడు . క్షయ అనేది ఇప్పటికీ ఓ ఛాలెంజ్ విసిరే రోగమే . అప్పటిలో దీనికి మందు ఏ లేదు . అయన క్షయ రోగము వలన కృశించి పోతూ - యదార్ధాన్ని బట్టి రాబోయే చావు ని గుర్తించి - రోజుకొక పెళ్లి చొప్పున నాలుగు వందల మందిని పెళ్లి చేసుకున్నాడు . "నాకు టైం తక్కువగా వుంది - పైగా నాకు పిల్లలు పుట్టే అవకాశం కూడా తక్కువగా వుంది- కాబట్టి ఎట్లా ఒకట్లగా ఒక వారసుని లేదా వారసురాలిని పుట్టించుకోవాలని అలోచించి అయన అన్ని పెండ్లిళ్లు చేసుకున్నాడు .ఈ పెళ్లిళ్లు కూడా " ఇక నీకు సంతానము కాదు - నీ జబ్బు అందుకు అనుమతించదు " అని రాచ వైద్యులు అనక ముందే చేసుకోవాలని నిర్ణయము తీసుకొని - చేసుకున్నాడు .

అయన ఆలోచన ప్రకారం -"ఇంత మంది రాణులలో ఒకర్తె అయినా తెంపరిది ఉండదా ? "నాకు పెళ్లి అయింది గానీ ఇంకా పిల్లలు పుట్టలేదు - అనుకుంటూ పిల్లల కోసమని తపన పడి " తప్పు దారి తొక్కి అయినా సరే - గర్భవతి ఐ "ఇదిగో నీ వారసుడు అంటూ ఒక్క పిల్ల వాడి నైనా నా చేతిలో పెట్టదా ? అని ఆలోచించాడు.

తన తల పోతుందేమే అనే భయం ఉన్నా కానీ , తన అక్రమ సంతానాన్ని రాజుగా చూడాలన్న కాంక్ష ఉండి తనతో అబద్ధము తెప్పగల ధైర్యవంతురాలుఈ నాలుగు వందల మందిలో ఒక్కర్తే ఉండదా అని కూడా ఆలోచించాడు . . అలోచించి అందుకు తగ్గ అనుకూల పరిస్థితులను కూడా కల్పించాడు .అయన ఊడ పొడిచేది ఏమీ లేక పోయినా గానీ ప్రతి రాణీ గదికీ పోయే వాడు. చూసిన వారు ఎవరైనా సరే "రాజుగారు ఆమె గదికి పోలేదు" అని గానీ -"పోయినాడు కానీ ఎదో ఒక్క సారే పోయి నాడని" కానీ - "పోయి ఒక్క క్షణమే వున్నాడు " అని కానీ అనుకోవటానికి వీలు లేకుండా తన కదలికలు జరిపే వాడు .

అంటే రాణులలో ఏ ఒక్కర్తే అయినా గర్భం తోఉంటే - ప్రజలు అది తెలుసుకొని - ఆగర్భము రాజు వల్ల కాదేమో? అని వూహించటానికి వీలు లేకుండా ప్రవర్తించే వాడు .అధికారం తో ప్రజలను ఒప్పించలేము - కానీ తెలివితో ఒప్పించగలము - అనే సిద్ధాంతము ను అయన అనుసరించాడు అని చెరిత్రకారులు అన్నారు . అయన కున్న క్షయ రోగానికి రాణుల గదుల చుట్టో తిరగటం అతి ఎక్కువ పని అయినా కానీ - అయనఓపిక తెచ్చుకొని ఆలా నేచేసేవాడు . చివరికి ఒక రాణి ఒక పిల్ల వాడిని కని రాజుగారికి వారసుని గా ఇచ్చింది .

ఎవరికీ గానీ వీడు రాజుగారి నిజం పిల్లడు కాదు అనటానికి సందు దొరకలేదు.ఇక మన రాజుగారు 32 ఏండ్లకు మరణించాడు . ఈ వారసుడు అతని వారసులు 400 ఏండ్ల పాటు రాజ్యము చేశారు .

పై సంఘటన ఆధారంగా 'నేను చెప్పదలుచుకున్నది ఏమంటే ? " అప్పు చేయటం అనేది తప్పు చేయటమే . కానీ బ్యాంకులు వచ్చి "తప్పు { అప్పు } చేయండి - అభివృద్ధి చెందండి" అని భోదిస్తాయి . అది అన్ని సార్లు నిజం అవదు కానీ కొన్ని సార్లు నిజం అవుతుంది . .రాజు గారు కూడా ఇదే పద్దతిలో " తప్పు చేసి అయినా అభివృద్ధి చేయండి " అని బోధించాడు .

మన నైతిక వాదులు ఈ రాజు గారి కహాని ని ఖండించ రావచ్చును .కానీ మహా భారత్ కధలో కూడా ఇదే తెలివి అమలు జరపబడింది అని వారు గ్రహించాలని కోరుతున్నాను .
. తెలివైన సార్లు "అప్పు అనే తప్పు చేయండి అని మనను ప్రోత్సహిస్తూ ఉండగా మనము అది చేస్తూ వున్నట్లే " ఆ రాణీ గార్లు కూడా అభివృద్ధి కోసము అని తప్పులు చేస్తూ వుంటారు .

సమురాయ్ తెలివి అనే ఇంకో కథ కూడా వున్నది . అది రేపు .

వారణాసి ఉమా శ్రీ రామ కృష్ణ అఫ్ అమరావతి యొక్క సొంత రచన .

**9.**చక్షు పీడా నివారణార్ధం
చక్షుమ్ ప్రక్షాళయామి .. **17-03-25**

ఒక నూతన దంపతులు చేస్తున్న స్వామి వ్రతానికి వెళ్ళాను . పంతులుగారు "చక్షు పీడా నివారణార్ధం చక్షుమ్ ప్రక్షాళయామి "..అని మంత్రం చదివారు . దీని అర్ధం చెడును చూడటమును అనే దానికి అలవాటు పడిన కన్నులను ఈ మంత్ర జలంతో ప్రక్షాళన చేసుకుని మంచి ద్రుష్టి పొంది కాపురం చేయండి అని అర్ధం కాబోలు . ఈ మంత్రము అయిన వెంటనే ఆ పిల్ల కలశములోనుండి కొంత నీరు తీసుకుని చేతిలో వేసుకొని దానిలో తన చూపుడు వేలును రంగరించి ఆ వ్రేలితో భర్త కన్నులను తుడిచింది .ఇదేందిరయ్య ఇది నేనెక్కడా చూడలేదే అంకున్నాను . తన వివాహ సమయం లో ఎదో ఓ ట్రెండ్ సెట్ చేయటానికి అని -- వీడియో వారు సంబరపడేదానికి అని ఆపిల్ల అట్లా చేసిందేమో ? . మొత్తానికి అందరమూ ఆపిల్ల పని తనానికి ముచ్చట పడ్డాము . ఆపిల్ల సంస్కృత బియ్యే చేసింది కాపట్టి - ఆ మాటలకూ అర్ధం తెలుసుకొని - సమయోచితంగా - స్పాంటేనియస్ గా అట్లా చేయగలిగింది అని ఒకాయన వ్యాఖ్యానించాడు .ఈయనయే "పెళ్లి చేసుకునే వారు తప్పని సరిగా సంస్కృతం నేర్చుకొని ఉండాలన్న నియమం రావాలి " అనే డిమాండ్ కూడా చేసాడు .

పై సంఘటన జరిగిన వెనువెంటనే కాదు గానీ -ఒక నెల లోపు అనుకోవచ్చు . " మా పెళ్లి ఫోటో ఆల్బం వచ్చింది . చుదురుగానీ రండి "అని ఆ పెళ్లి పిల్లవాడి తండ్రి పిలిస్తే వెళ్ళాను . ఫోటో ఆల్బం అంటే మీకు తెలీనది ఏమీ లేదు. అది లోల్లులకు మొదటి పేరు . " ఫోటో లన్నింటిలోనూ నువ్వు నీ - వాళ్ళే పడ్డారు . మావారు ఒక్కరూ లేరు " అని పిల్లాడి తరుఫు వారు పిల్లదాన్ని దెప్పుతారు . అక్కడనుండి లోల్లులు షురూ అవుతావి. ఇది కాదు అన్న వారి మీద నా ఒట్టు .

నేను వెళ్లే సరికి మొగ పిల్ల వారు ఆపిల్లని దెప్పుతూ వున్నారు . " అంతా నీవాళ్లదే రాజ్యం . మాదేముంది ?. మాకు ఆపెళ్ళిలోనే తెలిసింది లేమ్మా " లాంటి డైలాగ్లు వేస్తూ వున్నారు .
పిల్ల దేనికీ తొట్రుపడకుండా భర్త వంకచూసి " నాది లక్ష ఫోటోల అందమండీ . అంటే నన్ను లక్ష ఫోటోలు తీసినా -- గానీ ఏ ఫోటో గ్రాఫర్కి విసుకు రాని అందము నాది అని . మీది - మీ వాళ్ళది ఏడూ ఫోటో గ్రాఫుల అందము . అందుకనే వాడు మీకు ఏడూ ఫొటోలే తీసాడు . అయినా పోయిందేమీ లేదు. ఇకనుండి నా అందము మీతో షేర్ చేసుకుంటాను కదా ? కాబట్టి మీరు నాతో పాటె ఉంటే చాలును. నన్ను ఫోటో తీసిన వాళ్ళు మిమ్మల్నికూడా ఫోటో తీయక తప్పదు . అట్లా గా మీరు ఇకముందు ఎన్నో ఎక్కువ ఫొటోల్లో పడతారు . మనసు కష్ట పెట్టుకోకండి ప్లీజ్ . ఫోటో కావాలి అనుకున్నపుడల్లా నా కొంగు పట్టుకోండి చాలు . ప్లీజ్ నా ? " అని అతని కన్నులలోకి చూసింది .

ఇప్పుడు మా వాడికి చక్షు ప్రక్షాళనం అయి - కళ్ళకు కనపడే దాని నుండి చెడును చూడటము అనే పీడా నివారణము అయ్యిపోయింది . .

ఈనాటి నుండి మన స్త్రీలు తమ భర్తలను సాధించే దానిని మాని వారికి "ఛేక్షు ప్రక్షాళనం " చేసి ఉత్తమ ఫలితాలు రాబట్టుకోవాలని దేవతలు ఆసిస్తూ వున్నాము అని మీకు తెలుపుకుంటూ వున్నాను . ఇహ మొగవారు కూడా తమ ఛేక్షు ప్రక్షాళనలను ఓపన్ హార్ట్ తో ఇచ్చగించాలె అని కోరుకుంటూ వున్నాను . కనుల ద్వారా చెడు చూడటము అనే అలవాటు పోతే - కాపురంలో నరకం అన్నదే అగుపడదు . నరకం అనేది లేక పోయాక సంసారంలో కనపడేదంతా స్వర్గమే అవుతుంది కదా ?

వారణాసి ఉమా శ్రీ రామ కృష్ణ ఆఫ్ అమరావతి స్వంత కధ - వినోదం కోసం

## 8.ఎవరొచ్చినా అందుకే .. 14-03-25

ఎవరబ్బా మనఇంటికి వస్తున్నాము? ఎందుకొస్తున్నారో ? ఏమంటానికి వస్తున్నారో ? ఏమి అడగటానికి వస్తున్నారో ? అనే ఆశక్తి ఇప్పటికి కాస్త వెనుక రోజుల్లో దాకా ఉండేది . - ఇంటికి ఎవరన్నా వస్తే - వారు భోజనానికి వచ్చారేమోనని - ఏ బస్సు నో ట్రైన్ నో తప్పిపోయి కాసేపు ఇలా వచ్చారని - ఎదో అప్పు అడగటానికి వచ్చారేమో అని - మీకు పల్లెలో వున్న పొలం మాకు అమ్మరాదా ? అని అడగటానికి వచ్చారని - మీ పిల్లకు సంభందం తెచ్చాము అని చెప్పటానికి వచ్చారేమో అని - ఎదో హాస్పటల్ లో చూపించుకోవటానికి వచ్చారేమో ? అంటూ అనేక ఊహలు చేసేవారు . ఈ ఆలోచనలకూ వున్నా కిక్కు మరి దేనికి లేదు . ఆ కిక్కు లో

పడి , వచ్చిన వారిని కష్టపెడుతూ ఈసడించుకుంటూ మాట్లాడటం అనేది ఇల్లు నేర్చుకున్నాక ఈ రాకపోకలు తగ్గి పోయాయి  అనేది ప్రస్తుతము .

ఎవరొచ్చినా ఎందుకొచ్చారో ? అనే ఒక వినోద ము తో కూడిన కష్టం ఉండేది . థాంక్   గాడ్ ఇప్పు డంటారా ?  .ఆ  కష్టమే లేదు . సిస్టం మారి పోయింది ."అత్తయ్యా - మామయ్యా అని కానీ "పిన్నమ్మా - పెద్దమ్మా " అని కానీ అరుచుకుంటూ ఇంటి కొచ్చే వారు ఎవరింటికీ  లేరు . అట్లా అని వచ్చేవారు లేరు అని కాదు . వచ్చే వారు వుంటారు . కాక పోతే వచ్చిన వారు ఎందుకొచ్చారో అని  మనం వూహా చేయవల్సిన పని ఏ లేదు . ఎవరొచ్చినా ఆధ్యాత్మిక విషయాల మీదే వస్తారు . అదే మాట్లాడుతారు ." ఆ టీవీ ప్రవచనం మీరు విన్నారా ? అంటారు . " వినక పోతే మీరు ఏమి మిస్ అయ్యారో నేను చెపుతాను వినండి" అంటారు . "ఆ గుళ్లో ఉత్సవాల నేను రికార్డు చేసాను .  ఎంతో  బాగా వచ్చాయి . అవ్విటి   వీడియోలు మీకు చూపి , మీకు షేర్ చేస్తాను "అంటారు . చావులోనూ పెళ్లిలోనూ పురిటిలోనూ- పుట్టిన రోజుల్లోనూ -- అన్నింటిలోనూ ఈ ఆధ్యాత్మికత నే   నడుస్తూ ఉంటుంది .ఏరులై ప్రవహిస్తూ ఉంటుంది .

నలబై దాటని వారి పుట్టిన  రోజు వేడుకల్లోకి  ఇంకా ఈ  ఆధ్యాత్మికత  తొంగి చూడలేదు అనుకుందాము .  మీ నలభయ్యో పుట్టిన రోజు నుండీ మీకు ప్రతి రోజూ ఒక ఆధ్యామిక మిత్రుడు/భందువు  తగులుతుంటాడు .  అయన మీకు  ఆధ్యాత్మిక గురువు గా మారి మిమ్మల్ని శిస్యుడు గా తీసుకో వాలన్న కోరికతో వున్నాడు   అని ఏ కాక  - మీరు ఎప్పుడైనా పైలోకమునకు పోవచ్చునని - ఈ లోపుగా మీకు ఆధ్యాత్మక వెలుగులు చూపించ టము తనవంటి వారి  ధర్మమూ అని  అయన అనుకుంటూ వున్నాడని --మీరు సూటిగా నమ్మవచ్చు . ఈరోజుల్లో మీఇంటికి ఎవరొచ్చినా అందుకే ..అంటే మీ ఆధ్యాత్మిక సంపదను పెంచటాని కి - మీకు తమ ఆధ్యాత్మిక సంపదను పంచటానికి అనే  వస్తారు .వేరే ఏమీ ఉండదు .హ్యూమన్ రిలేషన్స్ అంటే ఆధ్యాత్మిక రిలేషన్స్ అనుకునే  రోజుల్లో మనము వున్నాము .

వారణాసి ఉమా శ్రీ రామ కృష్ణ అఫ్ అమరావతి స్వంత కథ

## **7.**అరిటాకు మ్యారేజ్ లైన్స్      **13-03-25**

మా మిత్రుడు పద్మనాభం  కనపడి  "ఏమండీ  ఎట్లాంటి కోడలు వస్తుందో అని మీరు దడుస్తూ ఉండటం వల్లనూ  , ఎలాంటి భార్య  వస్తుందో అని మీ వాడు  దడుస్తూ ఉండటం వల్లనూ--   అతని పెళ్లి  జాప్యం అవుతోంది అన్నారు కదా   ?  మన టౌన్ సెంటర్లో  " అరిటాకు మ్యారేజ్ లైన్స్" అనే దాని నూటఒకటో బ్రాంచ్ పెట్టారు . అక్కడికి వెళ్ళండి .    మీ వాడికి చప్పున  పెళ్లవుతుంది .  నాదీ గారెంటీ " అన్నాడు

అరిటాకు మ్యారేజ్ లైన్స్అన్నపేరు- దానితో పాటు . " కక్కు వచ్చినా ఆగదు -అని రాసి పెట్టి ఆ పక్కనే కక్కుకుంటున్న పెళ్లి కూతురు బొమ్మ --    "కళ్యాణము వచ్చినా ఆగదు " అని రాసి పెట్టి- ఆ పక్కనే తల గీక్కుంటున్న పెళ్లి కొడుకు బొమ్మ వున్న చోటే నేను  వెళ్లవలిసిన చోటు అని గుర్తించి అక్కడికి వెళ్ళాను .

దాని నిర్వాహకుడు నా దెగ్గర ఫది వేలు తీసుకొని " సార్ - ఈనాటి పిల్లలకు పెళ్లికాక పోవటానికి ముఖ్య కారణము "నాకు ఎట్లాంటి భార్య వస్తుందో ? అని మొగవాడూ ,---- " పెండ్లి అన్నది నా జీవన ప్రవాహానికి అడ్డు కట్ట- జీవితానికి బ్యాడ్ అని - " ఆడపిల్లలు భావిస్తూ ఉండటమే ఉండటమే . అందువల్ల మేము ఈ భయాన్ని పిల్లల్లో నుండి పోగొట్టి " పెళ్లి అంటే అరిటాకు మీద నీటి బొట్టు లాంటిది "అనే నమ్మకం అమ్మాయిలలో కలిగించి తద్వారా వారిని పెళ్ళికి ఒప్పించటం అనే పంథాను అనుసరిస్తాముక పెళ్లి అంటే అరిటాకు మీద నీటి బొట్టు లాంటిది " అని నమ్మే అమ్మాయిల సంభందాలు మా దెగ్గర కో కొల్లలు వున్నవి .కావాలంటే రేపే మీకు -- ఒక సంభందం ఫిక్స్ చేస్తాము " అన్నాడు .

"'ఏమి అనాలన్నా ఈ సంగతులు చాలవు - మరింతగా చెప్పండి' అని అడిగాను .

మా ద్వారా పెండ్లి అయిన వారు ఎప్పుడు కావాలంటే అప్పుడు-- ఎందుకు కావాలంటే అందుకు విడిపోవచ్చు . అందుకోసం నో లీగల్ ఫార్మాలిటీస్ . దీనికోసము అని మా మ్యారేజీ బ్యూరో ద్వారా పెళ్లి చేసుకునే జంటలకు మేము -- డిజిటల్ పద్దతిలో తాళి కట్టిస్తాము . అంటే అన్నీ సాంప్రదాయ పద్ధతి గా జరిపించి -- ఒక్క తాళి బొట్టు ను మాత్రము పిల్లడు కట్టినట్లు - పిల్లది కట్టించుకున్నట్లు డిజిటల్ ఇమేజెస్ క్రియేట్ చేసి చూపిస్తాము . ఇందువల్ల - - అయ్యో నేను 'తాళి' కట్టించుకున్నాను అనే బెరుకు పిల్లల్లోనూ - " నేను పిల్ల- మేడలో తాళి కట్టాను .నేను ఆమె మొగుడిని " అన్న అహంభావం పిల్లవాడిలోనూ కలుగదు . డిజిటల్ తాళి కాబట్టి ఆ పిక్ లను వీడియోలను డిలేట్ చేసేసి -- ఎవరూ ఎటువంటి సెంటి మెంటుకు పోకుండా ఎప్పుడు కావాలంటే విడిపోవటానికి వీలవుతుంది . ఇప్పుడు ఈ దిగిజిటల్ యుగంలో - ఇట్లాటి డిజిటల్ పెళ్లి అంటేనే ఆడపిల్లలు ఒప్పుకుంటూ వున్నారు . ఇది కాదు దు అనుకుంటే మీ వాడికి పెళ్లి జరిగేది కష్టం " అన్నాడు

"సరేను - చక్కగా అర్ధం అయింది . ఇలాంటి అమ్మాయిలు సగటున ఎంత ఎక్కువ కాలము మొగుడితో కాపురం వుంటారో మీరేమైనా చెప్పగలరా ?"

"అది మేము చెప్పలేము . విడి పోయే కారణాలను బట్టి విడిపోయే సమయం ఉంటుందండీ . మొగుడికి సాలరీలో అనుకున్నంత హైక్ రాలేదని, బాత్ రూలోని టైల్స్ రంగు బాలేదని , రొండు గంటలు గా వాషింగ్ మెషిన్ లోనానుతున్న బట్టలను మొగుడు బయటకు తీయలేదు , అనే కారణాలతో భర్తను విడిచి పెట్టిన వారున్నారు . కొందరు అమ్మయిలు అమెరికా వారి విడాకుల కేసులు స్టడీ చేసి - వారికంటే మేము ఎందులో తక్కువ అని వాదిస్తూ వారిలాగానే విడాకులు అడుగు తున్నారు . తన మొగుడు గోర్లు పెంచటం తనను గిచ్చి హింసించటానికె -- అని వాదించి విడాకులు పొందిన పిల్ల అమెరికాతో పాటు ఇప్పుడు మనకు కూడా వున్నది . మా ద్వారా దొరికిన అమ్మాయి మీ అదృష్టాన్ని బట్టి మీ వాడితో కాపురం చేస్తుంది. "

"అయితే మీరు చెప్పే సంభందాలు అన్నీ - ఆరు నెలలో లేదా సంవత్సరమో కాపురం చేసి తిరిగి వచ్చిన అమ్మాయిలవే అవుతాయేమో కదా ? మావాడితో పెళ్లి ఐన నెలలోపే ఆ అరిటాకు అమ్మాయి మూడో నెల గర్భిణీ అని తెలిస్తే -- మేమేమి చేయాలంటారు "

" ఇది చెప్పటానికే మా బోర్డు మీద కక్కు కుంటూ వున్న వధువు - తల గీక్కుంటూ వున్న వరుడి బొమ్మా వేసుకున్నాము. .పెండ్లి ముహూర్తము పెట్టుకోగానే మీరు మాకు లక్ష రూపాయ ల ఫీజు ఇచ్చి - అమ్మాయి పేర ఫది లక్షల బ్యాంకు గారెంటీ చూపాలి . ముహూర్తాలు పెట్టుకున్న -రోజు మొదలు కొని డిజిటల్ పెండ్లి పూర్తి అయ్యే వరకూ వున్న మధ్య కాలం లో - ఆ అమ్మాయి ఎప్పుడు కక్కుకున్నా మీరు ఆ పెళ్లిని రద్దుచేసుకో వచ్చు . ఆ మీ ఫది లక్షలూ మీవే . పెండ్లి అయినా మూడో నాడో నాలుగో నాడో ఆమె కక్కుకున్నది అనుకోండి - అప్పటికె ఆమె మీ కోడలు అయినది కాబట్టి ఆమెను మీరేమీ అనటానికి వీలు లేదు. అన్నారంటే మీ ఫది లక్షలు పోతవి . ఇట్లాకాక ఆమెనే " మా అయన అంటే నాకు ఇష్టం లేదు - అని గానీ మరొకందుకు గానీ , మీ వాడిని విడిచి విడిచి పెట్టే సిందే అనుకోండి . అప్పుడు ఎటువంటి లీగలు ఫార్మాలిటీస్ లేకుండా మీ వాడు మరో పెండ్లి చేసుకో వచ్చు. ఆమె తరఫునుండి ఏఅబ్ జెక్షన్ రాకుండా చూసే ,హామీ మాది . మీకు మరొక సంభంధం కుదిర్చి చూపే పూచీ కూడా మాదేను - " అని అయన అన్నాడు .

" -మీ అరిత్కు మ్యారేజీ లైన్స్ చాల బావున్నాడండి . పిల్ల అంతే అరిటాకుమీద నీటి బొట్టు లాంటిది అని నమ్మే కోడలు వచ్చి - వచ్చిన వెంటనే కక్కుకుంటుంతుందేమో అనే అనవసర భయం మాకు లేకుండా ఉంటే ఇది మా అబ్బాయికి బాగా సూట్ అవుతుంది . మా వాడుకూడా తనకు రాగాల భార్య పట్ల వాడికి వున్నా భయాల కొద్దీ - లీగల్ ఫార్మాలిటీస్ ఏమీ లేకుండా వదిలించుకోగల అమ్మాయికోసమే చూస్తూ వున్నాడు " అన్నాను .

అయితే రేపు క్యాష్ తో రండి అని అయన వీడ్కోలు చెప్పాడు .

వారణాసి ఉమా శ్రీ రామ కృష్ణ అఫ్ అమరావతి స్వంత కథ ఫర్ ఫన్ సిరియస్ గా తీసుకో వద్దు

## 6.సందు దొరికించు కోవాలని 12-03-25

" నా మొగుడట్లా లోనికి ఎందుకు పెడతాండో ? బయటికి ఎందుకు తీస్తా0డో ? నాకేమీ తెలుస్త లేదు . మీకేమన్న తెలుసునా " అన్నది ఒక పల్లెటూరి పిల్ల తన సోపతిరాళ్లతో ముచ్చట్లాడుతూ .

" వాళ్లేందుకు అట్లా చేస్తారో మనకెప్పుడూ అర్ధం కాదు .మా అయన కూడా అట్లాగే చేస్తాడు " అన్నది వింటున్న వారిలో ని ఒకర్తి . ఆ రహస్యము ఎదో తాను ఛేదించలేక పోయాను అని కించె పడుతున్న ముఖము పెట్టి .

అక్కడ వున్నా నలుగురిలో ఒకామె సంసార సారాన్నంతా కాచి దిగ మింగిన విగ్న్యరాలు . ఆమె ఏమన్నదంటే "మా అయన కూడా అట్లాగే చేస్తా ఉంటాడు .అయినా నేను ఏ మాత్రం పట్టించుకోను. నా పట్టు మీద నేనుంటాను .ముసుగేసుకుని పడుకుంటాను . మొగాళ్ళు ఆ బ్రాందీ బాటిల్ నో బీర్ బాటిల్ నో అలా ఫ్రిజ్ లో పెట్టి ఇలా తీస్తూ వున్నపుడు - నువ్వు ఎదో టెంప్టేషన్ ఫీల్ అయి "ఎందట్లా చేస్తన్నావు ? అనిఅడుగు తాము . వాడికి కావాలిస్ంది కూడా అదే . అంటే వాడికి నీతో మాట్లాడటానికి సందు కావలి .టెంప్ట్ అయి న నువ్వు అడిగిన వెంటనే వాడు సందు దొరకపుచ్చుకొని - కన్నీళ్లు పెట్టుకొని " నీకోసం - పిల్లల కోసం అని రేపటి నుండి నేను తాగుడు మానేస్తాను - ఇది ఆఖరి సారి కాబట్టి - ఇదే నా ఆఖరి కొరికే అనుకోని ఈ మందులోకి చికెన్ ప్రై గానీ ఓ ఆమ్లెట్ గానీ చేసివ్వు " అని అడుగుతాడు . ఇట్లా మనని ఎదో ఒకటి అడిగే సందు దొరికించుకునే దానికోసమని మగవాళ్ళు కావాలనే అట్లా బాటిల్ ని ఫ్రిజ్ లో పెట్టి తీస్తా వుంటారు .అది వాళ్ళ ట్రిక్. నువ్వు ఆ ట్రిక్ లో పడ్డావనుకో - ఎంత గింజుకున్నా కానీ - ఎంత అర్ధరాత్రి అయినా కానీ లేచి వాడికి ఎదో ఒకటి వండి పెట్టక తప్పదు . . వాళ్ళు తాగుడు మానేది లేదు మనము చూసేదీ లేదు. అందువల్ల ఎప్పుడు కూడా " ఏందీ ఇంత రాత్రి వేళా ఆ సీసాని అట్లా లోనికి పెట్టి ఇట్లా బయటకు తీస్తున్నవు " అని అడగొద్దు . అడిగా వంటే నువ్వు కనీసం ఆమ్లెట్ వేసేదానికి కమ్మిత్ అయినట్లే . సంసారం అన్నాక ఇట్లాంటివి ఎన్నోఎదురవుతా ఉంటవి . కాబట్టి జరా జాగర్తగా హోషియారీ తో వుండు " అన్నది .

ఇట్లా ఆడవారి మధ్య సంసార పక్షపు తెలువులు పంపిణీ అవుతూ ఉండును .

వారణాసి ఉమా శ్రీ రామ కృష్ణ అఫ్ అమరావతి స్వంత కధ

**5.**అమ్మ గారిని  అందలం ఎక్కించాను   **11-03-25**

బండ్లు తోలే  మొగవారందరికీ తెలుసు . ఇప్పుడున్న ఆడపిల్లలు ఎవరికీ గానీ ,దేనికీ గానీ దడవకుండా -యాక్టివాలు , స్కూటీ లు తోలేస్తున్నారని . ఒక్కో సారి వారి జోరు , మీతో అంటే మీ మొగవారితో రేసింగ్ కి దిగటానికి  వచ్చాము అని చెప్పటానికి అన్నట్లు  ఉంటుంది .
 "నిన్ను నమ్ముకొని నీకో  కుటుంబము వుంది - నీ కుటుంబానికి నీవే దిక్కు " అనే పోలీసు సూక్తి  ని - నమ్మి  మొగవారు బండ్లు నడుపుతూ వెంటే ఉంటే  -  ఆడవారు మాత్రం" నాకేమన్నా అయితే నాకు మా ఆయన వున్నాడు / మా డాడీ వున్నాడు ఇక నాకేంది ?"  అని ప్రశ్నిస్తున్నట్లు  నేటి ఆడ వారు బండి తోలుతూ ఉంటారని తోస్తుంది .  వున్నట్లుండి ఇప్పుడు - ఒక పిల్ల ఎవరో నా వెనకనుండి దూసుకువచ్చి ఒక్క అంగుళం తేడాతో నా మీదగా ముందుకు  దూసుకు పోయింది .  ఇహ  అదే అంగుళం తేడాని అలాగే పాటిస్తూ ఆటో లు కార్లు  ఏవి కనపడితే అవిటి మీదగా దూసుకు పోతూనే వున్నది.  ఆమెకు పిచ్చ థ్రిల్ వస్తూ వున్నది కాబోలు అనుకుంటే -  ఆమె డ్రైవింగ్ చూసి న వారికి పిచ్చ   బీపీ వస్తున్నది అన్నట్లు .

ఆమె వెళ్ళీ వెళ్ళీ  - ఎదో చేయ బోయి ఎదో చేసినట్లు - ఎదురు బోదురు గా వస్తున్న రొండు ఆటోల మధ్య న దూరింది . ఊపిరి అందిన వారందరూ తమ తమ బండ్లకు బ్రేక్ లు వేసుకున్నారు .
అప్పుడు  ఆ  ఆటోల మధ్య ఇరుక్కున్న ఆ పిల్లను దాటి పోయే అవకాశం - నాకు దక్కింది .
రాజ్యము ఏలుతున్న రాజుకు ఎదో ఒక హిత బోధ  ఇవ్వాలని ముసలి మంత్రికి గులగా ఉంటుంది .అలాంటి గులాయే నాకూ కలిగి - రోడ్డును ఏలుతున్న  ఆ పిల్లకు - ఎదో ఒక హితబోధ చేయాలని   అనుకున్నాను  .

నేను ఆమె పక్కన ఆగి -- నా హెల్మెట్ తీసి - ఆమెనుండి గౌరవం తో కూడిన  స్పందన పొందేందుకు అని - నా తెల్ల జుట్టు ను ఆమెకు చూపి   " ఎమ్మా  ఇంత చిన్నతనం లో నీ కేమన్న అయి- కన్నో- వెన్నో -  కాలో చేయి   పోతే  --  నీకు పెళ్లి కావటం ఎంత కష్టమో ఆలోచించావా ?' అన్నాను . అని - లోక క్షేమం కోరే  మహామునితన గడ్డం  తడుముకున్నట్లు నేను నా తెల్ల గడ్డం తడుముకున్నాను . సరే ఆమెకు ముప్పది ఏండ్లు పైగా ఉంటవని   పిచ్చి దద్దమ్మ కైనా తెలిసి పోయేట్లు  వుంది  .ఇహ నేను  ఎదో కావాలనే నేను అట్లా అన్నాను . దానితో ఆమె సంతూర్ సబ్బు వాడిన పిల్లకు మల్లె చాలా సంబరపడి " థాంక్ యూ అంకుల్-

నా పెళ్లి అయి ఫదేళ్లు - ఇద్దరు కిడ్స్ . నేను జాగర్తగా వుంటాను .మీరు కూడా జాగ్రత్తగా డ్రైవ్ వెళ్ళండి " అన్నది .

అందలం అనగా పల్లకి .నా మాటలతో ఆమె పల్లకీ లో ఎక్కిన ఫీలింగ్ లో పడి - తనను తాను పల్లకీ ఎక్కి తిరిగే పెళ్లిగాని యువతి తో పోల్చుకోని - తన బండి ఏ ఒక పల్లకీ అనే ఫీలింగ్ లో పడాలని నేను ఆశించాను . వాడు సంతూర్ సబ్బు వాడు ఇట్లాగే ఆశించి సక్సెస్ పొందాడు కదా ? అందువల్ల నేను కూడా సక్సెసు పొందుతాను అని ఆశించాను .

నా హిత బోధ ఆమె మీద ఏమి ఫలితం చూపుతుందో చూడము అని ఆమెను ముందు కు పోనించి ఆ వెనుక నేను వెళ్ళాను .అక్కడనుండి ఆమె అందలం మందగమనం తో వయ్యారంతో - రోడ్డుకు వన్నె తెస్తూ ముందుకు కదిలింది .ఆమె అందలం మా ట్రాఫిక్ కి వన్నెతెచ్చింది. ఇట్లా నా వల్ల ఎదో ఓ పావు గంట పాటు రోడ్డు ప్రమాద రహితంగా మారింది . ఒక జంక్షన్ దెగ్గర నా ఇంటి వైపు నేను - ఆమె పోవాల్సిన వైపు ఆమె చీలి పోయాము . ఇప్పుడు మనం సంతూర్ సబ్బు వయసుకు వంకలు సరి తీయటమే కాక - వారి ట్రిక్ ట్రాఫిక్ ను కూడా సరి దిద్ద గలదు అని తెలుసుకున్నాము .
"అయితే - ఇలాంటి పొగడ్తల కోసం - మీ బండ్లను మీరు వీర తోలుడు తొలండి అని మీరు మహిళలకు చెప్పా దలుచుకున్నారా ? ఇదేనా ఈ కధ ద్వారా మీరు చెప్పా దలుచుకున్న నీతియా ? అని నన్ను అడగవద్దు . నేను చెప్పా డదలుచు కున్నది అది కాదు . "ఆడవారిని హమేషా పొగుడుతూ వుండాలని - గిరీశం గారు అన్నారు" అని చెప్పా దలుచుకున్నాను .

వారణాసి ఉమా శ్రీ రామ కృష్ణ అఫ్ అమరావతి సొంత కధ

**4.**సెకండు నుండి ఫది సెకండ్లకు **06-03-25**

నేను వెళ్లే సరికి మా బావ వేదాంతం గోపాల కృష్ణ మూర్తి - తన బావమరిదితో ఉపన్యసిస్తూ వున్నాడు . మామూలుగా మాట్లాడే దానికి కొంచెము స్పీడ్ ఇస్తే అదే ఉపన్యాసము అవ్వదా ? అన్నది నా అభిప్రాయము . అతను నా మేన మామ కొడుకు అవటం వల్ల నా బావ. వింటున్న వాడు అతని భార్య నలుగురి తమ్ముళ్లలో మొదటి వాడు . కాబట్టి మా బావకి బామ్మర్ది .
మా బావ గోపాల కృష్ణ మూర్తి తన నవ యవ్వనంలో నాటక రంగాన్ని ప్రోత్సహించ తలిచి ఒకటి రొండు దఫాలు స్వంత ఖర్చులతో శ్రీ కృష్ణుడి వేషము కూడా వేసి వున్నాడు . అందువల్ల అయన తాను ఉపన్యసించేపుడు గీతా భోద చేస్తున్న శ్రీ కృష్ణుని లా ముద్ర పడతాడు . గీతా భోద అంటే సీరియస్ సబ్జెక్టు నే కదా ?

కృష్ణం బావ ఇట్లా అంటున్నాడు " ఏమోయీ - నాకు మీరు నలుగురు బావమరుదులు . మనలో మనము తగాదాలు పడి , ఎదో ఎదో, అనుకుని ఎడం పెడంగా ఉండటానికి వీలులేదు . దీనికి ప్రకృతి నియమము ఎదో ఒప్పదు . అందువల్లే కృష్ణుడు అర్జునునికి నాలుగు తగిలించి "ఛెల్" బేటా అనటానికి బదులు - గీతను చెప్పి, అనునయంతో ఒప్పించాడు .అనగా బామ్మర్దిని బ్రతిమాలుకున్నాడు అనుకో వాలే . బామ్మర్దితో ప్రేమగా వుండెహె అనే దృష్టి మనకు కారపటానికి భారతం నడిచింది. అలాగే " అన్న తమ్ముళ్ల మధ్య ఏవో తగాదాలు , వైరాలు , మాటపట్టింపులు ,టష్కీ పటలాలు వుండవలిసినదే అని ప్రకృతి నియమము ఎదో ఉన్నట్లు కూడా అనిపిస్తూ ఉంటుంది . లేనట్లయితే కృష్ణుడు అటు కౌరవులను ఇటు పాండవులను కూచుండ పెట్టి గీతా భోధింప పడవలిసి వుండే . కాబట్టి మనము బావా బావమరుదులము ఎన్ని మాటలు అనుకున్నా కానీ ఒకరితో ఒకరము స్నేహముతోనూ , ప్రేమలతోనూ ఒకరిని ఒకరము క్షేమించుకుంటూ ఉందాము .నువ్వు కాదనకు " అన్నాడు . అత్తా గారి ఇల్లు తనకు ఒసగిన చిన్న చూపును దృష్టిలో పెట్టుకొని మా బావ ఎదో తిరగేస్తూ వున్నాడని నాకు తోచింది .

ఆ బావమరిది తల గోక్కుని " నాకేమీ అర్థం కాలేదు క్రిష్నయ్య బావా " అన్నాడు . " నీకు అర్థం అయ్యేదానికోసం చెప్పవలిసింది ఏమిటంటే ?? " నా అన్న తమ్ములే వున్నారు అనుకో - నేను మరణిస్తే అందుకు వారు బాధపడతారా ? లేదు .అట్లా అని సంతోష పడతారా అంటే అదీలేదు . పరమ న్యూట్రల్ గా " జాతస్య మరణం ధృవం "అని ఒక్కసెకను లో నే మామూలు అయిపోతారు . దీనికి కారణం నాభార్య తో వారి భార్యలకు వున్న జగడాలు . ఆస్తి తగాదాలు - మాట పట్టింపులు వంటివి ఎన్నో ఉంటాయి . ఇక నా మరణం సంగతి ఓ సంగతి కాదని వారు దాటవేసుకోవటమే కాక - తమ పిల్లలకు కూడా ఏమీ చెప్పకుండా " మా పిల్లలు భయ పడతారు " అంటూ దాటవేస్తారు .ఎవరూ ఒక్క కన్నీటి చుక్క రాల్చరు . దీనికి ప్రకృతి తోడ్పడుతుంది . చచ్చిన అన్నను పట్టుకొని ఏడ్చిన తమ్ముడు నీకు ఎప్పుడన్నా కనపడ్డాడా ? ఇలాగే జరగాలి అన్నట్లు , మరొక విధంగా ఎదో జరక్కుండా ఉండేటట్లు ఆ ప్రకృతి చూస్తుంది. ."గురువుగారి కి పాద పూజ చేద్దాము అనుకుంటుండగానే మా అన్నగారు ఇట్లా చచ్చినాడు . ఇంకా నయం . అన్ని ఏర్పాట్లు చేసి అడ్వాన్సులన్నీ ఇచ్చినాక చచ్చినాడు కాదు " అని వారు ఎదో ఒక సంతోషం కూడా పొందుతారు . అనగా మనకు తిప్పలు తేకుండా చచ్చినాడు అన్నట్లు ఫీల్ అవుతారు అని .

అదే బావమరుదులైతే అట్లా అనుకో కుండా " అయ్యో " అనుకుంటారేమో అని నాకో ఆశ వున్నది. బావమరిది బ్రతక కోరుతాడు అంటే " అయ్యో మాబావ ఇంకొన్ని రోజులు బ్రతికి ఉంటే మా అక్క పసుపుకుంకుమల్తో ఉండేదేమో " అని విచారపడతాడు అని కావచ్చునేమో . దీనికి కారణము మొగవారికి తమ అన్నతమ్ములపై జీరో ప్రేమలు - అప్ప చెల్లెళ్ళ పై అవాజ్యమైన ప్రేమలు వుండటమే . ఇది ఇట్లా ఉండవలెనని ప్రకృతి నియమము కూడా వున్నది అని అనేక రుజువులు దొరుకుతావి. ఇదికాక - " ఆడ శ్రద్ధ" అనే మాట వున్నది కదా ? ఆ మాట

కొద్దీ నా పట్ల ముందుగా నా అక్క యో - నా చెల్లియో కన్నీరు పెట్టుకుంది . ఆ కన్నీరు చూసి నీవు "అయ్యో" అని విచారపడతావు . నిన్ను చూసి నీ పిల్లలు కూడా " మాఅమ్మకూ నాన్నకూ ఎదో కష్టం వచ్చింది పడిందే అని విచార పడతారు . ఇలా జరిగాక - మీరందరూ విచారం నుండి తేరుకొని "జాతస్య మరణం ధృవం " అని వచించటానికి - నా అన్న తమ్ముళ్లకు పట్టిన క్షణం కన్నా ఇంకో పధి క్షణాలు ఎక్కువ పట్టవచ్చు అని నా అంచనా . నేను చస్తే ఈ లోకంలో కలిగే విచారము సెకండు నుండి ఫధి సెకండ్లకు పెరగాలని నాకో పెర్రి కోరిక వున్నది -- ప్రకృతి న్యాయము ప్రకారము - అది నెరవేర్చ గలిగిన వారు మీరే కాబట్టి -- మనము బావా - బావమరుదులము వివాద పడవద్దు - తగాదాలు పడవద్దు - నువ్వు నీ బావమరుదులతో తగాదా పడవద్దు. తగాదాల వల్ల కార్చవలిసిన కన్నీరు కు అడ్డు కట్టలు పడతవి - కళ్ళు ఎండిపోతవి " అని చెప్పి ముగించాడు .

మా కృష్ణం బావ యొక్క బామ్మర్ది వాళ్ళ బామ్మర్దులతో ఎదో తగాదాలు పెట్టుకుంటే - అలాంటివి పెట్టుకోవద్దు అని మా కృష్ణం బావ హితోప దేశము చేస్తూ వున్నాడా ? ఏమి అని నా బుర్ర అన్నది .

"ఇందు వల్లనే నా బావా ? ఆ వారణాసి కోటవార శాస్త్రి గారు -తనకు 12 మంది అన్న తమ్ముళ్లు వున్నా అదిచాలాక 10 మంది అన్న తమ్ముళ్లకు మధ్య ఒక్కతే అయినా పేదింటి పడుచును కోరి పెండ్లి చేసుకొని బోలెడు మందిని బావ బావమరుదులను సంపాదించుకున్నాడు .?? ఇప్పుడంతటి దూరదృష్టి ఎవరికుంది .నీకున్నది కానీ " అని ఆ బావమరిది అన్నాడు. అని "అయితే బామ్మర్ది లేని సంభందం మా పిల్లవాడికి చేయొద్దనేనా నీ హితవు ? నీకు చెప్పుదాము అనుకుంటూ నే వున్నాను . ఆ సంభందం మొన్ననే క్యాన్సల్ అయిపోయింది " అని అతడు అన్నాడు .

వారణాసి ఉమా శ్రీ రామ కృష్ణ అఫ్ అమరావతి స్వంత కథ
.

3.యువరక్తాలూ మీకు ధన్య వాదాలు - 01-03-25

నిన్న మాఊరు పెళ్లి తిరిగి నావూరు వస్తూ వున్నాను . బస్సు ఎక్కేటప్పటికీ రాత్రి ఏడూ గంటలైంది . తొమ్మిదింటికి ఇంటికి చేరుకుంటావులే అని నన్ను బస్సు లెక్కించటానికి వచ్చిన మా పెద్ద సోదరుడు అన్నాడు . కానీ అది నిజం కాలేదు . బస్సు డ్రైవెర్కి ఎడమ పక్కనే ప్రయాణికులు ఎక్కే డోర్ వుంది . ఈ డోర్ కి దరి దాపుల్లో బసుకు చెందిన రేకు డబ్బాలాంటి వస్తువేదో వున్నది { ఫస్ట్ ఏడిద బాక్స్ ఏమో ?} మా బస్సు ఓ పెద్ద గుంటలో పడి బుస్సు మని పైకి లేచినపుడు ఈ రేకు డబ్బా ఎగిరి లేచి డోర్ లోనుండి దూసుకొని పోయి రోడ్ మీదకు పడింది .బస్సు లో ఎదో విరిగింది అని అందరం అనుకున్నాము . ఆ బాక్స్ పడటానికి

బస్సు ఆగటానికి మధ్య వంద మీటర్లు గడిచింది . రూలు ప్రకారం ఆర్టీసీ డ్రైవర్ బస్సు ను రోడ్డు మీద బండి అపి దిగకూడదు . అదంతా కండక్టర్ భాద్యత . అందువల్ల అతడు బస్సు అపి అలాగే కూచున్నాడు . కండెక్టర్ ఒక లేడీ . ఆమె బస్సు దిగి అటూ ఇటూ చూసి "అది కనపడటం లేదు . పొయ్యి రోడ్డుపక్కన ఉన్న కంపల్లో పడిందేమో .అక్కడ పాములు ఉంటే ఎట్లా ? నేను వెతకను "అంటూ మళ్ళీ సీటులో కూచుంది .చదరంగం ఆడేటప్పుడు - ఏమీ తోచక బిగుసుకు పోతామే - ఆ ఫోజులో బస్సు ను అట్లాగే పెట్టి ఓ అరగంట కూచున్నాము . నాది చల్ల బడ్డ రక్తము కదా
అందుకని " ఆర్టీసీ బస్సు అన్నాక మనను డెస్టినేషన్ చేర్చాల్సిన భాద్యత వారిదే . దిగి వెళ్లే పోండి అనరు కదా ? ఐ యామ్ సేఫ్ అని ఫీల్ అయి కాళ్ళు బార జాపి కూచున్నాను .
మనము బండి వేసుకొని రోడ్డు మీద వెడుతూ ఉంటే - యువరక్తము ఉన్న వారు - వారు యువతీ ఐనా యువకుడైనా మన మీదుగా దూసుకు పోయి మనను టెన్షన్ పెడుతూ వుంటారు .
అప్పుడు నేను "ఈ యూత్ కి భయం గియం లేదు. రోడ్డు మీద బోర్లా బడితే అప్పుడు తెలుస్తుంది. నాలాగా నింపాదిగా బండి తోలటం ఎంత అవసరమో ? అని అనుకోవటమే కాక - నా నోటి వ్యాఖ్యాన వాడి బండి తక్షణం నేలకు కరుచుకొని వాడికి నేను కోరుకున్నంత బుద్ధి రావాలి . వాడికి దేముడు కనపడాలి " అని కోరుకుంటాను . మీరు కూడా నాలాగే "మీకు నచ్చని వారికి దేముడు తక్షణం బుద్ధి చెప్పాలని " కోరుకుంటారు కాబోసు . ఇదంతా చివరికి - ముసలి రక్తం వెర్సెస్ యువరక్తం - లేదా యువతలో అంత వేడి రక్తం ఉండొద్దు అనే వాదం గా కూడా అయి పోతుంది .
బస్సు లో ఒక్కడే యువకుడు వున్నాడు . అతడు మేస్త్రీ ల కింద చేసే కూలీ - కునికి పాట్లు పడుతూ వున్నాడు . మన దృష్టి తో చూస్తే అతని టైంకి పెద్ద విలువేమీ లేదు . ఇలాంటి ఆలస్యాలు అయినపుడు మనకు ఎదో కొంపలు కూలిపోతాయి కానీ - అతనికి ఏమీ కూలవు అనే ఊహలు తెప్పించే యువకుడు . బస్సులో కి వచ్చే చల్ల గాలి తగలక అతడు నిద్రలేచి - విషయం తెలుసుకొని - తన సెల్ ఫోను లో టార్చ్ వెలిగించుకుని బస్సు వెనక్కి పోయాడు. వీడు కండెక్టర్ కోసం అని బస్సు దిగాడు కాబట్టి వాడు వచ్చే దాకా ఈ బస్సు కదలదు అనే ధైర్యంతో నేనూ బస్సు దిగి చూడ సాగాను . ఆ యువకుడు రోడ్డు దిగి మోకాలు వరకూ ఉన్న తుప్ప చెట్లల్లో కి వెళ్లి ఓ అరగంట పాటూ వెతికి - ఆ బాక్స్ ని సాధించు కొచ్చాడు .నేను ఇంటి కొచ్చాను .

పాములు అతని పాలికి అన్నంలో అప్పడాలు ఏమీ కాదు గదా ? అతని లో భయం మొలకెత్తకుండా అతని యువరక్తం లో ని వేడిమి ఏ ఆపింది . తాను ఒక హీరో పని చేసుతున్నాను అని అతని రక్తమే అతన్ని నమ్మించింది . మనకు భయం లేని మనుషులు అవసరం అనుకునే వారు - యువరక్తాలకు శాపనార్థాలు పెట్టవద్దు . పైగా వారికీ ధన్యవాదాలు తెలుపాలె . చప్పట్లు కొట్టాలే . యువుకుల్లో వేరే రకం రక్తం వుండాలని ఆ దేమునికి ఓ కోరిక లేకపోతే అది అసలు ఎందుకున్నట్లు ?

*వేడి రక్తము ఉన్న యువత అంతా నేల కరవకుండా ఆ తల్లి పార్వతియే రక్షిస్తూ వున్నది అన్నట్లు ఈ కథ కు అర్ధము  చెప్పుకొని అక్షింతలు వేసుకుందాము .

వారణాసి ఉమా శ్రీ రామ కృష్ణ అఫ్ అమరావతి  స్వంత కథ

* మనలో విమర్శకులకు కొదువలేదు . అయితే మీరు యూత్  పోరగాళ్లను జోరు మీద బండి తోలమని ప్రోత్సహిస్తున్నారా ? మీరు సమాజానికి ఏమి సందేశము ఇస్తున్నారు అని వారు నామీద ఎగురు తారు   . వారికీ సమాధానంగా ఈ చివరి వాక్యము ప్రవచించానో.

**2**. సూదిలో దారం సందులో బేరం   28-02-25

ఈ మిట్టమధ్యాన్నపు ఎండలో ఆపసోపాలు పడుతూ - నా బండి మీద ఇంటికి వస్తో వున్నాను . నేను ఒంటరి వాడిని. ఇంటికి వెళ్లి ఇన్ని చల్లని నీరు తాగి మంచానికి అడ్డం పడదాము అని ఆలోచిస్తూ వున్నాను .  నా బండి మీద మా  సందులోకి  తిరిగే సరికి - టీవీఎస్ బండి మీద దూది పరుపులు వేసుకొని అమ్మే వాడొకడు నా కన్నా ముందు పోతూ నాకు అడ్డం తగిలాడు . అతని బండి వెనక నాలుగు అడుగుల వెడల్పు గల పరుపులు ఒక దాని మీద ఒకటి గా ఓ  6 పరుపులు వున్నాయి . మా సందేమో అంతంత మాత్రం వెడల్పుది. నాకు దారి వదిలితే  తన పరుపులు ఏమవుతాయో అన్నట్లు అతను నాకు దారి వదలటమే లేదు .నేను ఎలాగో రోడ్డు పక్క అంచులమీదుగా నా బండి తో అతన్ని దాటి  " నువ్వు మా  సందులో కి రావద్దు  . ఇక్కడ నీ పరుపును కొనటానికి నేను తప్ప వేరే  మొనగాళ్లే  లేరు . నాకా  పరుపు అక్కరలేదు . డాక్టర్ చెక్క మంచం మీద పడుకో మన్నాడు .  పో .. వెనక్కి పో .  అయినా పరుపు ఎంతేమిటి ? అని అడిగాను .

అతడు నన్ను తీక్షణంగా చూసి -- " ఈ సందులోకి రావద్దంటానికి మీరెవరండీ ? ఇదేమన్నా మీ అబ్బ గారి జాగీరా ? ధర మీకెందుకు మీది కొనే మొఖం కాదుగా  "  అన్నాడు . నేను అన్న మాటకు అతడు సమంగానే  రియాక్ట్ ఐనాడని మీరు న్యాయం చెప్పవచ్చు . పైగా " నువ్వు ఆ మాట అనకుండా ఉండాల్సింది" అని నాకు సమంజసం చెప్పా వచ్చు  .పెద్ద వయసు వచ్చినాక వుచిత సలహాలు ఇవ్వటం - సముచితమే అని పిస్తుంది కదా ?అందుకని ఓ సలహాగా  " మా  సందులో కి రావద్దు " అని చేప్పాను . నాకు వేరే ఉద్దేశ్యం వేరే ఏమీ లే .

" కొనే మొఖమా కాదా ?అనేది నీకు తొందరలోనే తెలుస్తుంది . నువ్వు మా సందులోకి వెళ్లి ఒక్క పరుపైన అమ్మి వస్తే నేనొక పరుపు  ఐదు వేలు ఇచ్చి కొంటాను . ఇదిగో డబ్బులు చూడు "-అని డబ్బులు చూపాను .  అంతటితో ఆగకుండా  " నువ్వు అమ్మక పోతే -- ఐదు వందలకు ఓ  పరుపు ను నాకు అమ్మాలి  . నువ్వు వెనక్కి వచ్చి - నాకు అమ్మితే కానీ నన్ను దాటి

పోను వీలు లేకుండా  నాబండి ఈ రోడ్డుకు అడ్డం పెట్టి వుంచుతాను " అని అతని తో చెప్పి ఓ చెట్టు నీడన కూచున్నాను .
" అదిచూద్దాంగా " అని అతడు పొగరుగా తల ఎగురవేస్తూ ముందుకెళ్లాడు . "ఐదు వందలపరుపు" కోసం సెను నా ఆకలి దప్పిక శ్రమలు అన్నీ మర్చి పోయి అట్లాగే కూచున్నాను .

వందకు పైగా ఇళ్ళు వున్న ఈ సందుపై నా కంట్రోల్ ఏమిటా అని మీకు అనుమానం రావచ్చు .

మా సందులో వున్న వంద ఇళ్లలోని నలభై ఇళ్లలో మనుషులు వుండరు . వారు వారి పిల్లల వద్ద ఇటు హైద్రాబాదు లోనో అటు బెంగుళూరు లోనో వుంటారు . పనిమనుషులు వచ్చి వాకిళ్లు చిమ్మి
ముగ్గులు పెట్టి పోతారు . అందువల్ల మనుషులు లేకపోయినా గానీ ఇళ్ళు సజీవంగా మనుషులు ఉన్నట్లు- ఉంటాయి .ఇంకో ముప్పై ఇండ్లలో వుండే వారి పిల్లలు ఇటు అమెరికాలోనో అటు ఆస్ట్రేలియాలోనో వుంటారు .వీరు పొరపాటుసైనా సరే " రాత్రి నిద్ర పట్టలేదురా నాయనా " అని పిల్లలతో అంటం ఆలస్యం . అన్న మూడో నాటికల్లా వారింటికి కొరియర్లో ఓ మెత్తని కింగ్ సైజు పరుపు వచ్చి పడుతుంది . వాళ్ళ ఇళ్లలో మనిషికి నాలుగు పరుపులు ఉంటాయి .పిల్లికి కుక్కకీ రొండేసి పరుపులు ఉంటాయి . వాళ్లకు పరుపులు అంటే వాంతులు వస్తాయి .ఇంకో పదిహేను ఇళ్లలోని వారు తెల్ల వారి ఝామున పడుకొని సాయంత్రం ఆరింటికి లేచి - అప్పుడు తిని మళ్ళా రాత్రంతా మేల్కొంటారు . వారి ఆరోగ్య సమస్యలు అలాంటివి . వీళ్ళు పగలు వేసుకొనే మందుల వల్ల పగలంతా బండ నిద్రపోయి - రాత్రి వేసుకునే మందుల వల్ల రాత్రి పూట శివరాత్రి జాగారం లాంటిది చేస్తారు .ఇంకా వెళ్ళేమి పరుపులు కొంటారు ? ఇంకా మిగిలిన వారు వున్నారుకదా ? ఆ ఇళ్ల లోని ఆడా మోగా ఇద్దరూ కూడా ఉదయాన్నే నాలుగింటికల్లా నిద్ర లేచి క్యారేజీలు కట్టుకొని - రైలెక్కి పొరుగు ఊర్లు వెళ్లి అక్కడ టీచర్ - బ్యాంకర్ ఉద్యోగాలు చేసి మళ్ళీ రాత్రి తొమ్మిదింటికి ఇంటికి చేరుతూ-- అప్ అండ్ డౌన్ తిరిగే మనుషులు . ఇహ సేనొక్కడిసే " ఎవరినన్నా మనుషులను చూద్దాము - అని ఇట్లా టౌన్ లోకి - మా సందులోకి ఆసులో ని కండెకు మల్లె తిరుగుతూ వుంటాను .

ఇహ మా సందు సూదిలో దారం వంటిది . అంటే మా ఈ సన్నని సందు అట్లా అట్లా చాల దూరం పోయి - దారపు కొస వెనక్కి త్రిరిగి వచ్చి ఆగినట్లు - వెనక్కి తిరిగి ఇక్కడికే వచ్చి ఆగుతుంది .అట్లాంటి సందులో సేను బేరం కోసం {500 రూపాయలకే పరుపు సొంతం స్సేసుకునే} నిలబడి వున్నాను .

అదుగో అతడు వెనక్కి వస్తూ వున్నాడు . మీకు మా సందు సంగతి తెలిసిందికదా ? అతడికి ఏ ఒక్క పరుపు కూడా అమ్మకం జరిగి ఉండరాదని కోరుకోండి .
'
సూదిలో దారం సందులో బేరం' అనే మాటకు ఏదో విపరీతపు అర్థం వుంది అనుకుంటే - ఇప్పుడు అది లేనట్లే అయ్యింది .

వారణాసి ఉమా శ్రీ రామ కృష్ణ అఫ్ అమరావతి స్వంత కథ

**1.ప్రజా పెద్దలు 23-02-25**

ప్రజా పెద్దల లో కొందరు వెళ్లి ప్రభుత్వ పెద్దలని కలిసి "ఆ ప్రభుత్వము పోయి మన ప్రభుత్వము వచ్చిన ఫీలింగులు ప్రజలలో రావటం లేదు . ఏదన్నా చేయండి " అని వాపోయారు

వారు అధికారులని కూచో పెట్టి " మీరు ఐ ఏ ఎస్ నా లేక ఐ పీ ఎస్ నా అనే బేధం పాటించకుండా -- వెళ్లి హెల్మెట్ లేని ద్విచెక్ర వాహన దారులు వారి పని పట్టండి . హెల్మెట్ పెట్టుకోకపోవడం అంటే గవర్నమెంట్ లేదు అని అనుకున్నట్లే , అందుకని సీరియస్ గా ఉండి ప్రభుత్వము వున్నదని ప్రతి ఒక్కరూ ఫీల్ అయ్యేట్లు చేయండి " అని చెప్పారు.

ఏమీ తోచని రిటైర్డ్ బ్యాంక్ మేనేజర్ ఒకరు ఉలిక్కి పడి లేచి - " భద్రతా కారణాల వల్ల బ్యాంకుకు గానీ -దాని ఏటీఎం కి గాని వందమీటర్ల పరిధిలో ఎవరూ హెల్మెట్ పెట్టుకొని తిరగరాదని ఆర్డర్లు వేయండి " అని అడిగి అది సాధించుకో వచ్చాడు . జనం హెల్మెట్ తీసి బ్యాంకు ను దాటి మళ్ళీ హెల్మెట్ పెట్టుకొని ముందుకు కదిలారు . ఇది చని బోబోతున్న బ్యాంకింగ్ వ్యవస్థలకు గౌరవ వందనం చెల్లించినట్లుగా మారింది . న్యాయ వాదుల సంఘము రంగ ప్రవేశము చేసి " హెల్మెట్ పెట్టుకొని వారిని పట్టుకొని అక్కడికక్కడే పెనాల్టీ వేసి పంపటం మంచి పని కాదు . నా తల న ఇష్టం అనే వారూ, హెల్మెట్ వేడికి నా జుట్టు రాలితే తిరిగి ఎవరు మొలిపిస్తారు ? అని వాదించ దలిచిన వారు వుంటారు. అందువల్ల హెల్మెట్ లేని కేసులన్నీ కోర్టులకు పంపాలి . మాకు సంపాదనా మార్గము పెంపు చేయాలి " అంటూ ప్రభుత్వ అధికారులకు విన్నవించు కున్నారు .

లాయర్లు  ఇట్లా చేసారని తెలిసి వారి సోదరులైన  డాక్టర్స్ అసోసియేషన్ వారు వెళ్లి " ఈ హెల్మెట్ ల వల్ల తలపండు పగిలి హాస్పిటల్ లో చేరే వారు తగ్గి -- మా ముఖ్యమైన ఆదాయవనరు పడి పోయింది . అందువల్ల మీరు మా హాస్పిటల్స్ కు    ఉచిత విద్యుత్ - నీరు ఇచ్చి ఆదుకోండి " అని విన్నపం చేశారు .
- పోస్ట్ మార్టం చేసిన శవాన్ని అప్పగిచటానికి డబ్బులు డిమాండ్ చేసే ఘనులు వున్నారు కదా ? వారు   వెళ్లి  " మాకు పని లేకుండా పోతోంది .అందువల్ల మమ్మల్ని రెవిన్యూ డిపార్ట్మెంట్లో నో - చెక్ పోస్టులలోనో ఎంప్లాయ్ గా మార్చండి " అని డిమాండ్ చేసి వచ్చారు .

హెల్మెట్ ల అమ్మకాల మీద అవి  లేని తలల మీద ఆధారపడి న వారు - వెళ్లి-- "కొన్న ఆరు నెలల తరువాత ఏ  హెల్మెట్ కూడా చెల్లదు - ఎక్సపెరీ అయిపోతుంది - . అని ఆర్డర్స్ ఇవ్వండి " దీనితో మీకు వచ్చే పన్ను రాబడి కొద పెరుగుతుందిఅని  ఆశ పెట్టి వచ్చారు .

మహిళా మణులు ఊరేగింపుగా వెళ్లి " హెల్మెట్ వెనుక " భాలనా  ఆవిడ కి భర్త " అని రాయటం కంపల్సరీ అనీ చట్టం తెండి . లేకపోతే మా మొగవారు హెల్మెట్ ముసుగేసుకుని రకరకాల ఆడవాళ్ళని వెంటేసుకొని తిరుగు తున్నారు అని మా డౌట్ " అని విన్నపం  చేసి వచ్చాబు. ఈ డిమాండ్ ను ఆమోదించవద్దని పురుషులు ఎదురు ఉద్యమం చేశారు .

"తాళి బొట్లు బయటకు కనపడేట్లు వేసుకుని తిరిగే స్త్రీలకూ  హెల్మెట్ అవసరం లేదు అని జీవో ఇచ్చి మా కాలం వృధా కాకుండా  మమ్ము ఆదుకోండి" అని బండ్ల పై వెళ్లే ఆడవారిని-  తమ బండ్ల తో ఛేజు చేసే అబ్బాయిలు అడిగి వచ్చారు .

యూత్ గర్ల్స్ యూనియన్ అనే వారు వెళ్లి " పనిలో పనిగా తల మీద చూపించిన శ్రద్ధ బాయ్స్ మొలమీద కూడా చూపించండి . క్రికెట్ ఆడే వారు కట్టుకునే మొల చిప్పలు మొగవారికి కంపల్సరీ చేసి వారి నుండి మాకు రక్షణ కల్పించి - మేము  అర్ధరాత్రి పూట వీధుల్లో తిరిగే  స్వేచ్ఛ కల్పించండి " అని డిమాండ్ చేసి వచ్చారు

ఇట్లగా --హెల్మెట్ మూలంగా వారికి అందరూ కూడా ప్రభుత్వము వున్నది అని ఫీల్ ఆవ సాగారు

